# FAST TRACK ENGLISH

## అత్యంత వేగంగా

# ఇంగ్లీషు మాట్లాడండి

T. రవికుమార్ B.Sc.



సరస్వతి పబ్లికేషన్

సత్యనారాయణ పురం, విజయవాడ - 11

# FAST TRACK ENGLISH

by T. Ravikumar B.Sc.



**FIRST EDITION**

*2002*

**PAGE MAKERS**

*VISWA DIGITALS*
*Annapurna devi Street,*
*Gandhinagar, Vijayawada - 3*
*Ph. 400 023*

**COVER DESIGN**

*N.V. Ramana*

**PRINTED AT**

**PUBLISHED BY**

**SARASWATI PUBLICATION**

*Satyanarana puram,*
*Vijayawada- 11*

*Price: Rs.* **20 -**



---

ఈ పుస్తకము సాధ్యమైనంత వరకు తప్పులు లేకుండా ముద్రించియున్నాము. ఏవైనా తప్పులు ఉంటే మాకు తెలియపరిస్తే మలి ముద్రణలో సవరించుకొనగలము.

---

# FAST TRACK ENGLISH

# అత్యంత వేగంగా ఇంగ్లీషు మాట్లాడండి

సామాన్యులు సైతం అతి త్వరగా ఆంగ్ల భాషలో మాట్లాడగలిగేలా, రాయగలిగేలా చేయడమే ఈ 'Fast Track English' లక్ష్యం.

ముందుగా ఆంగ్లభాషకు అక్షరాలు 26. అవేమిటో చూద్దాం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I |
| ఎ | బి | సి | డి | ఇ | ఎఫ్ | జి | హెచ్ | ఐ |
| J | K | L | M | N | O | P | Q | R |
| జె | కె | ఎల్ | ఎమ్ | ఎన్ | ఓ | పి | క్యూ | ఆర్ |
| S | T | U | V | W | X | Y | Z | |
| ఎస్ | టి | యు | వి | డబ్ల్యూ | ఎక్స్ | వై | జెడ్ | |

## భాష (Language)

భాష అంటే ఏమిటి? మనిషి తన మనసులో కలిగే ఆలోచనలను, భావాలనూ యితరులతో పంచుకోవడానికి చేసే ప్రయత్నంలోంచి పుట్టినదే భాష. ప్రపంచం మొత్తం మీద కొన్ని వేల భాషలు ఇలా పుట్టినవే ! సంస్కృతం, హిందీ, ఇంగ్లీషు, ఫ్రెంచ్, స్పానిష్, లాటిన్, రోమన్, తెలుగు, తమిళం... యిలా ఎన్నెన్నో భాషలు మానవజాతిలో వాడుకలో వున్నాయి.

## భాష అంటే ఏమిటి? (Letters)

భాషకు ప్రాణం అక్షరాలు. కొన్ని అక్షరాల గుంపును పదం లేదా (Word) మాట అంటారు. కొన్ని మాట గుంపును వాక్యం (Sentence) అంటారు. కొన్ని వాక్యాలు కలిస్తే ఒక సందర్భం అవుతుంది. చెప్పదలుచుకున్న విషయం చెప్పడం జరుగుతుంది. వాక్యాల సముదాయాన్నే 'భాష' అంటారు.

## భాష (Language) ఎన్ని రకాలు?

భాష రెండు విధాలు

1. మాట్లాడే భాష (Speaking Language)
2. వ్రాసే భాష (Writing Language)

ఇక్కడొక ముఖ్య విషయం చెప్పాలి. మాట్లాడే భాషకైనా, రాసేభాషకైనా వ్యాకరణం (Grammar) ముఖ్యం.

## వ్యాకరణం (Grammar) అంటే ?

ఒక వాక్యంలో ఏ ఏ పదాలు వుంటే పూర్తి అర్థాన్ని యిస్తాయో చెప్పేదే వ్యాకరణం. అంటే మరింత విపులంగా చెప్పటం అవసరం.

Grammar లో కొన్ని భాషాభాగాలు (Parts of Speech) వుంటాయి. అవి ముందు ముందు తెలుసుకుందాం.

ఒక వాక్యం పూర్తి కావాలి అంటే కనీసం మూడు భాషాభాగాలు వుండాలి. అవి కర్త (Subject), క్రియ (Verb), కర్మ (Object).

ఉదా : నేను ఇంటికి వెళ్ళాను

I went home

పై వాక్యలో (I) అనేది కర్త (Subject), వెళ్ళాను (went) అనేది క్రియ (Verb), ఇంటికి (home) అనేది కర్మ (Object)..

ఇలా వాక్య నిర్మాణం చెయ్యాలి. వాక్యాలు మూడు రకాలు.

1. సాధారణ వాక్యం (Declarative Sentence)
2. ప్రశ్న వాక్యం (Interrogetive Sentence)
3. ఆజ్ఞా వాక్యం (Imperative Sentence)

యిప్పడు ఈ మూడు వాక్యాలనూ వివరంగా తెలుసుకుందాం.

## 1. Declarative or assertive Sentence

ఏదైనా ఒక విషయాన్ని తెల్పే వాక్యాన్ని డిక్లరేటివ్ సెంటెన్స్ అంటారు.

A sentence which makes a declaration or statement.

Ex : 1. I go to Market. — నేను మార్కెట్‌కి వెడతాను.

2. He read the lesson — అతను పాఠం చదువుతాడు.

3. We pray for God. — మేము భగవంతుని ప్రార్థిస్తాము.

## 2. Interrogative Sentence

A sentence which asks questions.

వాక్యం ద్వారా ప్రశ్నవేసే పద్ధతిలో ఈ ఇంటరాగేటివ్ సెంటెన్స్ ఉంటాయి.

Ex : 1. How are you? — నీవు ఎలా వున్నావు?

2. Who are you? — నువ్వు ఎవరు?

3. What is this? — ఇది ఏమిటి?

4. How it happened ? — ఇదిఎలా జరిగింది?

5. Where are you living? — నువ్వు ఎక్కడ నివసిస్తున్నావు?

6. Do you hear me? — నువ్వు నేను చెప్పేది వింటున్నావా?

*INTERROGATIVE SENTENCE*

| | |
|---|---|
| 1. Affirmative | 2. Negative |
| Yes I know | No, I do not know |

## 3. Imperative Sentence

ఆజ్ఞ, ప్రార్థన, కోరిక, నిషేధము, అనుమతిని తెలిపే వాక్యాన్ని ఇంపరేటివ్ సెంటెన్స్ అంటారు.

Imperative sentence is that which commands, requests, prayer, entreaty

Ex : 1. Come here, go there, sit down, standup, excuseme

## 4. Exclamatory Sentence

ఆశ్చర్యార్థక (Exclamatory) వాక్యాన్ని ఆశ్చర్యం కలిగించే సందర్భాలలో వాడతారు.

An Expression or surprsies

Ex : 1. How beautiful parrot is ! — చిలుక ఎంత అందంగా వుంది!

2. Yes. We won the match. అవును. మేం ఆట గెలిచాం.
3. What a wounderful place ఎంత అద్భుతమైన ప్రదేశం.
4. What a surprising visit! ఎంత ఆశ్చర్యకరమైన రాక!

## THE PHRASE

కొన్ని మాటలతో కూడి వుండి ఒక ప్రత్యేక అర్థాన్ని సూచించే వాటిని 'పద సముదాయం' అంటారు.

A Phrase is a group of words which gives some sense and forms part of a sentence.

Ex : 1. He caught Red handed, అతను తప్పు చేస్తూదొరికిపోయాడు
2. Rawvi's face Turned blue రవి మొహం మాడిపోయింది.
3. The pen is on the T.V. కలము టెలివిజన్ మీద వుంది.

పై వాక్యంలో Underline చేసిన పదాలు కొంత అర్థాన్ని మాత్రమే యిస్తున్నాయి. కాని పూర్తి అర్థాన్ని ఇవ్వటం లేదు. వీటిని phrases అంటారు. ఇవి వాక్యానికి అందాన్నిస్తాయి.

## THE CLAUSE

వాక్యం కొంతభాగమై వుండి కర్తనూ (subject) వాక్యపు ఉత్తర (predicate) భాగాన్నీ కల్గి ఉంటుంది.

A clause is group of words which forms part of a sentence and contains a subject and predicate unlike a phrase.

1. That woman wears a diamond necklace (Sentence)
2. That woman wears a necklace 'which is made of diamonds'.

(Clause) వాక్యంలో భాగంగా ఏర్పడి subject, predicate కూడా కలిగి ఉంటుంది. ఈ వాక్యంలో which is made of diamonds అనే దానిలో which - subject, is made of gold - predicate.

Do you know there Budha was born?

ఇందులో where - subject, budha was born - predicate

ఇప్పుడొక ఉదాహరణ చూద్దాం.

1. She wears a silk saree
   ఇది సాధారణ వాక్యం
2. She wears a Saree which is yearned with silk.
   ఇక్కడ వాక్యం మరోవిధంగా చెప్పబడింది.

Which అనే clause చేర్చబడింది.

ఈ రెండవ వాక్యంలో Which అనేది కర్త (subject) గా వుంటుంది. ఆ తర్వాత వున్న is yearned with silk అనేది ఉత్తరభాగం predicate అవుతుంది.

**మరో ఉదాహరణ చూడండి.**

1. I bought a steel carriage
2. I bought a carriage which is made of steel.

రెండవ వాక్యంలో

Subject = which
Predicate = is made of steel
ఇలాగే మరి కొన్ని వాక్యాలు మీరు తయారు చేయండి.

## PARTS OF SPEECH - భాషాభాగాలు

Words are divided into eight (8) kinds according to the part they play in a sentence. These are called parts of speech.

సాధారణంగా వాక్యాన్ని 8 భాగాలుగా విడదీస్తారు. ఒక్కొక్క భాగం వాక్యంలో ఒకొక్క అర్థాన్ని (పనిని) తెల్పుతాయి. అందువల్లే వీటిని భాషాభాగాలు అన్నారు. అవి...

They are :

1. NOUN (నామవాచకము)
2. PRONOUN (సర్వనామము)
3. VERB (క్రియ)
4. ADJECTIVE (విశేషణము)
5. ADVERB (క్రియా విశేషణము)
6. PREPOSITION (విభక్త్యర్థ పదము)
7. CONJUNCTION (సముచ్ఛయము)
8. INTERJECTION (భావోద్రేక పదము)

### THE NOUN (నామవాచకము)

*Def : A noun is the name of any person, place or thing.*

మనుష్యులు, జంతువులు, వస్తువులు (పర్వతములు, నెలలు, వారములు, నదులు, సముద్రములు, ఖండములు వగైరా) నామవాచకములు అనబడును.

Ex : Ravi, Sita, Book, pen, cat, Mumbai, Bhopal, Kolkatta, The Ganges, the Ramayana, The Birla Temple.

## THE VERB (క్రియ)

*Def : A verb is a words which expresses doing or being or possessing.*

పనులను, స్థితులను తెలియజేసే పదాలను క్రియ (verb) అంటారు.

Ex : He eat food.

They play cricket.

I read the book

పై మూడు వాక్యాలలో Eat (తినుట), Play (ఆడుట), Read (చదువుట) అనే మూడూ పనులు. ఏ వాక్యానికైనా ఈ పని (verb) చాలా ముఖ్యమైనది.

## THE PRONOUN (సర్వనామము)

*Def :A pronoun is a word used instead or in the place of a noun.*

నామవాచకమునకు బదులుగా వాడబడు పదమును (Pronoun) సర్వనామము అంటారు. 'Pronoun' అనగా for a noun అని అర్థం.

Ex : I, me, my, mine
you, your, yours
He, his, him
They, their, theirs, them
you, your, yours
we, our, ours, us
She, her,hers
It, its

- Durga is a nice girl.
- She is calm going.

పై వాక్యాలలో మొదటి వాక్యంలోని Durga అనే నామవాచకాన్ని రెండో వాక్యంలో అనే సర్వనామంతో చెప్పాం. సర్వనామాన్ని వాడటం వల్ల ప్రతిసారిగీ నామవాచకాన్ని చెప్పకుండా సరిపోతుంది. వాక్యం అందంగా కూడా ఉంటుంది.

- This is my pen — This pen is mine
- That is your Ball — That Ball is yours
- This is his Book — This Book is his
- This is her pen — This pen is hers.

## THE ADJECTIVE (విశేషణము)

*Def : An Adjective is a word which teels the kind, Quality of a thing or the number of things. An Adjective qualifies a noun.*

వస్తువుల గుణవిశేషణమును, పరిమితిని, సంఖ్యను తెలియజేయు పదములను విశేషణములు *(Adjective)* అంటారు.

Big, small, Black, red, ten.

విశేషణం వలన నామవాచకపు గుణం తెలుస్తుంది.

Ex : 1. I have a big house నాకు పెద్ద యిల్లు వుంది.

2. He is a great man అతను గొప్ప వ్యక్తి

3. Pappy is a black dog పప్పీ నల్లని కుక్క.

4. It is a deep river ఇది లోతైన నది

5. They came in a Red car వాళ్ళు ఎర్ర కారులో వచ్చారు.

పై వాక్యాలలో Big (పెద్ద), great (గొప్ప), black (నల్లని), deep (లోతైన), red (ఎర్రని) అనే పదాలు వాటి నామవాచకాల (Noun) గుణాల్ని తెలిజేస్తున్నాయి.

## THE ADVERB (క్రియా విశేషణము)

*Def : An Adjective is a word which adds to the meaning of a verb, an adjective or another Adverb. An adverb modifies a verb.*

క్రియావిశేషణం అనేది ఒక క్రియ (verb) కు గానీ, ఒక విశేషణా (Adverb) నికి గానీ లేదా మరో క్రియా విశేషణానికి (Adverb) గానీ అవి జరిగే తీరును గానీ వుండే స్థితిని గానీ తెలియజేస్తుంది.

Ex : 1. Ramu Runs fastly. రాము వేగంగా పరిగెడతాడు.

2. Githa sings sweetly. గీత తీయగా పాడుతుంది.

3. Our bus is going slowly. మన బస్సు మెల్లగా వెడుతోంది.

4. The monkey climbed the tree speedly కోతి తొందరగా చెట్టెక్కింది.

పై వాక్యాలలో పరిగెత్తు (run), పాడటం (sing), వెళ్ళటం (go), ఎక్కడం (climb) అనే క్రియలు ఎలా జరుగుతున్నాయో అంటే వేగంగా (fastly), తీయగా (sweetly), నెమ్మదిగా (slowly), తొందరగా (speedly) జరుగుతున్నట్లు తెలిసింది.

అందువల్ల ఈ పదాలు క్రియా విశేషణాలు (Adverb) అన్నారు.

## THE PREPOSITION (విభక్త్యర్థ పదము)

*Def : A Preposition is a word which shows the relation between things stand to one to another. A preposition is said to govern the noun or pornoun that comes after it.*

వాక్యంలోని నామవాచకాని (Noun)కీ, యితర భాషాభాగాలకూ మధ్య సంబంధాన్ని తెలియజేసేది విభక్తి పదము (Preposition)

ఉదా :

1. The pen is on the table. కలము బల్ల మీద వుంది.
2. He got in to the bus. అతను బస్సులోకి ఎక్కాడు.
3. We climbed down the tree. మేము చెట్టు క్రిందకి దిగాము.
4. They are proud of me. వారు నా వల్ల గర్వంగా వుంటారు

పై వాక్యాలలో మొదటి వాక్యంలో కలము (Pen) ఎక్కడ వుంది? బల్ల (Table) మీద వుంది. అంటే అనే నామవాచకం ఉన్న స్థితిని మీద (On) అనే విభక్తి పదం చెప్పింది.

అలాగే రెండవ వాక్యంలో లోపల (In), మూడో వాక్యంలో క్రిందకు (Down), నాల్గవ వాక్యంలో వల్ల (Of) అనేవి విభక్తి పదాలు.

## *THE CONJUNCTION* **[సముచ్ఛయము]**

*Def : A conjunction is a word which merely joins two words or sentences.*

మాటలను, వాక్యములను కలుపు మాటలు *conjunctions* 'సముచ్ఛయము' అనబడును.

Ex : And, or, becuase, but, though, therefore, as

Ex : 1. Ramu and Shyam are good friends

రాము మరియు శ్యామ్ మంచి మిత్రులు

2. He waited but no use.

అతను వేచి వున్నాడు కానీ ప్రయోజనం లేదు.

## *THE INTERJENCTION* **[భావోద్రేక పదము]**

*Def : A conjunction is a word which merely joins two words or sentences.*

సంతోషము, ఆశ్చర్యము, విచారము వంటి భావోద్రేక పదాలతో తెలుపు మాటలు interjenction అంటారు.

Ex : 1. Oh! What a beautiful Rose!

ఆహా. ఎంత అందమైన గులాబీ పువ్వు

2. Hurray! I got First class !

హుర్రే నాకు ప్రథమశ్రేణి వచ్చింది.

3. Alas ! India loose the match.

అయ్యో! భారతదేశం ఆటలో ఓడిపోయింది.

4. Ah! Now curiasity bigins

ఆహా ! ఇప్పుడు ఉత్కంఠ మొదలయ్యింది

ఇలాగే మీరు కొన్ని వాక్యాలు వ్రాయండి.

1. ______________________________

2. ______________________________

3. ______________________________

4. ______________________________

## THE ARTICLE

A, An, the ఈ మూడు మాటలను Articles అంటారు.

A, An రెండూ Indefinite articles

The అనేది definite article

'An' is used before words begining with a vowel sound అచ్చు యొక్క ధ్వనితో మొదలయ్యే ఏకవచన పదానికి ముందు 'An' ఉపయోగిస్తారు.

Ex: An ox, an ant, an hour

'A' is used before Singular words begining with a consonant sound.

హల్లుల యొక్క ధ్వనితో ఆరంభించబడు ఏకవచన పదానికి 'A' అని ఉపయోగిస్తారు.

Ex: a boy, a book, a car, a year, a young man నామవాచకాన్ని ప్రత్యేకముగా చెప్పనపుడు definite article 'the' వచ్చును.

Dogs are faithful animals

The cow is a useful animal

Cows are useful animals

The boy is my friend

He is a boy — అతను ఒక బాలుడు

I eat an apple — నేను ఒక యాపిల్ తిన్నాను

The dog is black — ఆ కుక్క నల్లనిది

పై మూడు వాక్యాల్లో (1) Boy (బాలుడు)లో 'B' హల్లు కనుక 'A' (2)లో Apple లో 'A' అచ్చు కనుక 'An' మూడో వాక్యంలో నల్లగా వున్న కుక్క ప్రత్యేకమైనది కనుక ముందు 'The' అనే ఆర్టికల్స్ ఉపయోగించడం జరిగింది.

## Use of Capital Letters

ప్రతి వాక్యములో మొదటి మాట (అక్షరం) Begining of a sentence poetry లో ప్రతి line మొదటి మాట. Proper nouns అనగా మనుష్యుల పేర్లు, దేశములు, పట్టణములు పేర్లు, వారముల పేర్లు (names of weeks) నెలల పేర్లు (names of months) నదుల పేర్లు (rivers) సముద్రముల పేర్లు (oceans) పర్వతముల పేర్లు (mountains) ఖండముల పేర్లు (continents) గ్రంథముల పేర్లు, I, God అను మాటలు Quotation లోని వాక్యపు మొదటి మాట capital letter తో ప్రారంభించబడును.

## NOUNS (నామవాచకములు)

## PROPER NOUN (వ్యక్తి వాచకము)

*Def: A proper Noun is the name of only one person, place or thing.* ప్రత్యేకముగా ఒకే వ్యక్తికి గాని, స్థలమునకు గాని, వస్తువునకు గాని సంబంధమైన పేర్లు Proper Nouns (వ్యక్తి వాచకము) అంటారు.

Ex : Ravi, Gita, India, The Ganges, The Ramayana proper nouns

A, An, the అనే articles వాడరాదు. A Ravi, An Gita, The Ganges అని వాడరాదు. Proper Noun capital తో ఆరంభించవలెను. Proper Nouns, descriptive sense లో (అర్థవంతముగా) ఉపయోగించబడినపుడు అగును.
**వ్యక్తివాచకాలకు ముందు**

Ex: 1.Brodman is the greatest player in cricket (Proper Noun)

బ్రాడ్‌మన్ క్రికెట్‌లో గొప్ప ఆటగాడు

2. Tendulkar is the broadman of India.

టెండుల్కర్ భారతదేశానికి బ్రాడ్‌మన్ అంతటివాడు

(ఇక్కడ Broadman, Tendulkar పోల్చబడడం వల్ల ఈ రెండవ వాక్యంలో Broadman అనే Proper noun - common noun అయ్యింది.)

## COMMON NOUN (జాతి వాచకము)

*Def: A common noun is the name that can be given to all things persons of the same class or kind.* ఒకే జాతికి సంబంధించిన వస్తువులు, వ్యక్తులు మొదలగువాటికి చెందదగిన పేర్లు Common Nouns (జాతి వాచకము) అంటారు.

Ex : Book, Pen, Cow, dog, table

1. Common Noun ముందు Article తప్పకుండా ఉండాలి
2. Common Nouns, capital letter తో వ్రాయకూడదు

## COLLECTIVE NOUN (సమూహ వాచకము)

*Def: A collective noun denotes a number of persons animals or things taken as one group.*

మనుష్యులు గాని, జంతువులు గాని, వస్తువులు గాని, చెందిన గుంపులను (సమూహమును) తెలియజేయు మాటలు Collective Nouns (సమూహ వాచకము) అనబడతాయి

Ex : army, batalian, crowd, flock, herd, fleet, lunch, navy.

## MATERIAL NOUN (వస్తు వాచకము)

*Def: A Material noun is the name of same material or substance which is supposed to have no separate parts.*

సాధారణముగా, విడిభాగములనుద్దేశింపక ఒకే భాగముగా గాని, ముద్దగా గాని, ద్రవముగా గాని పేర్కొను పదార్థములు Material Nouns (వస్తు వాచకము) అనబడును.

Ex : rice, sand, coal, iron, gold, silver, milk, water, oil, chalk, clay.

## ABSTRACT NOUN (భావ వాచకము)

*Def: An abstract noun is the name of any quality, state or action, art or science*

మనుష్యుల, జంతువుల, వస్తువుల గుణములు భావవాచకములు అవుతాయి.

*Qualities* (గుణములు) : clean, whiteness, good ness, cleverness, height, weight, length.

*Actions* (పనులు, చర్యలు) : walk, talk, laugh, flight

*states* (స్థితులు) : poverty, childhood happiness, pleasure, youth, health, sleep, dream

*Arts* (కళలు) : Action, poetry, music, Dance

*Sciences* (శాస్త్రములు): Astronomy, grammar, physcis, psychology.

## GENDER (వస్తు వాచకము)

నామవాచకము యొక్క లింగమును అంటే అది పుంలింగమా, స్త్రీ లింగమా లేదా నపుంసక లింగమా తెల్పునది లింగము (Gender)

*Def: Gender is that form of the Nouns which shows whether what is spoken of is male female or neut (neutor)*

మగజాతిని తెలియజేయు మాటలు (పేర్లు) *masculine Gender* (పుంలింగము) అగును.

Ex : Boy, cock, man, He

*THE NAMES OF FEMALES* are of the Feminine Gender. స్త్రీ జాతిని తెలియజేయు పేర్లు Feminine Gender.( స్త్రీ లింగము) అగును.

Girl, cow, woman, hen, she

*The names* of things with out life are of neuter Gender

ప్రాణము లేని వస్తువుల పేర్లు (inanimate objects) నపుంసక (Neuter gender) నకు చెందుతాయి. అంతేకాక

స్త్రీ జాతికి, మగజాతికి రెండిటికీ చెందునట్టి పేర్లు Common gender (ఉభయ లింగము) అందురు.

Ex : Child, servant, cousin, parent, people, person

N.B. cousin brother, cousin sister అనే ప్రయోగములు తప్పు. cousin అనే అనవలెను.

| | |
|---|---|
| Masculine - | he his, him |
| Feminine - | She her, hers |
| Neuter - | it, its |
| Common - | I, you, they, our, them, us |

1. MASCULINE: (పుంలింగ) రూపమునకు 'ess' చేర్చితే స్త్రీలింగపదం ఏర్పడుతుంది. Tiger(మగ) + ess = Tigress (ఆడ)

2. Sex భేదమును తెలియచేయు He, she, man, woman, mad, lord, lady, cock, hen అనే పదాల్ని జంతువులు, ప్రదేశములు వంటి Nouns కు వెనుకగాని, ముందుగాని చేర్చి చెప్పడం వల్ల అది ఏ లింగ వర్గానికి చెందినదో తెలుస్తుంది.

Ex: he goat, she goat, man servant maid servant, land lord, land lady.

ప్రత్యేక పదాన్ని వాడటం వల్ల కూడా 'లింగము' తెలుస్తుంది.

Ex: boy, girl, brother, sister, father, mother

The masculine Gender becomes feminine gender by adding 'ess'. 'ess' చేర్చడం వల్ల స్త్రీ లింగాలుగా మారే పుంలింగ పదాలు.

| Masculine | Feminine |
|---|---|
| Lion (లయన్) మగసింహం | Lioness(లయనెస్) ఆడు సింహం (సివంగి) |
| Tiger (టైగర్) మగపులి | Tigress (టైగరస్) ఆడపులి |
| Poet (పొయెట్) కవి | Poetess (పొఎటెస్) కవయిత్రి |
| Author (ఆధర్) రచయిత | Authoress (ఆధర్స్) రచయిత్రి |
| Master (మాస్టర్) యజమాని | Mistress (మిస్ట్రెస్) యజమానురాలు |
| Emperor (ఎంపరర్) చక్రవర్తి | Empress (ఎంప్రెస్) మహారాణి |
| God (గాడ్) దేవుడు | Goddess (గాడెస్) దేవత |
| Count (కౌంట్) రాజు | Countess (కౌంటెస్) రాణి |

*2. By adding a word before or after*

ఒక పదాన్ని అదనంగా ముందుగానీ, వెనుకగానీ చేర్చడం వల్ల లింగం మారే పదాలు

| Masculine | Feminine |
|---|---|
| He goat (హి గోట్) మగ మేక | She goat (షి గోట్) ఆడు మేక |
| Cock sparrow (కాక్‌స్పారో) మగ పిచ్చుక | Hen sparrow (హెన్ స్పారో) ఆడపిచ్చుక |
| He baffalo (హి బఫెలో) దున్నపోతు | She beffalo (షి బఫెలో) గేదెబర్రె |
| Peacock (పీకాక్) మగనెమలి | Pea hen (పీ హెన్) ఆడు నెమలి |
| Man servant (మాన్ సర్వెంట్) పనిమనిషి | Maid servant (మైడ్ సర్వెంట్) పనికత్తె |
| Milk man (మిల్క్ మాన్) పాలవాడు | Milk maid (మిల్క్‌మైడ్) పాల మనిషి |

*3. By using a different word.*

ప్రత్యేకపదం వాడడం వల్ల లింగము తెలిసే పదాలు

| Masculine | Feminine |
|---|---|
| Boy (బాయ్) బాలుడు | Girl (గార్ల్) బాలిక |
| Man (మాన్) మగవాడు (పురుషుడు) | Woman (ఉమన్) స్త్రీ |

Husban (హస్బెండ్) భర్త
Wife (వైఫ్) భార్య
Cock (కాక్) కోడిపుంజు
Hen (హెన్) కోడిపెట్ట
Son (సన్) కుమారుడు
Daughter (డాటర్) కూతురు
Horse (హార్స్) మగగుర్రం
Mare (మేర్) ఆడ గుర్రం
Dog (డాగ్) కుక్క (మగ)
Bitch (బిచ్) ఆడ కుక్క
Ram (రామ్) పొటేలు
Ewe (ఈ) ఆడ పొటేలు
King (కింగ్) రాజు
Queen (క్వీన్) రాణి
Nephew (నెఫ్యూ) మేనల్లుడు
Niece (నీస్) మేనకోడలు
Uncle (అంకుల్) మనమామ
Aunt (ఆంట్) మేనత్త
Sir (సర్) అయ్య
Madam (మేడమ్) అమ్మ
Gentle man (జంటిల్‌మన్)
Lady (లేడి) స్త్రీ (గౌరవం గల)
Father (ఫాదర్) తండ్రి
Mother (మదర్) తల్లి
Brother (బ్రదర్) సోదరుడు
Sister (సిస్టర్) సోదరి
Bull (బుల్) ఎద్దు
Cow (కౌ) ఆవు

## <u>NUMBER</u> (వచనము

Number is of two kinds. వచనము రెండు విధములు

1. SINGULAR NUMBER (ఏకవచనము)
2. PLURAL NUMBER (బహువచనము)

***Def: When a noun denotes only one thing, it is said to be in the singular number.***

ఒక వస్తువును మాత్రమే తెలియజేయు నామవాచకములు (Nouns) singular Number (ఏకవచనము)లో వుండాలి.

<u>Ex:</u> boy, girl, book, pen, slate, bag, box

***Def: When a noun denotes more than one thing it is said to be in the plural Number.***

ఒకటి కంటె, ఎక్కువ వస్తువులు తెలియచేయునపుడు Plural Number (బహువచనములో) లో వుండాలి.

<u>Ex:</u> Boys, girls, books, pens, slates, bags, boxes

To make plural

By adding 'S' to the singular ఏకవచనము (Singular number) బహువచనము (Plural) లోకి మారాలంటే ఏకవచన పదానికి 'S' చేర్చాలి.

Ex: boy - boys, girl-girls, cat-cats.

by adding 'es' మరికొన్ని పదాల తరువాత 'es' చేర్చాలి.

Ex: Ass-Asses, Bunch-Bunches, Bush-Bushes

Ex: Box-Boxes, Bench-Benches

by adding-s

Ex: Monarch-Monarchs

by changing word fe in to 'VES' కొన్నిటికి 'Fe' బదులు 'Ves' చేర్చాలి.

Ex: leaf-leves, wife-wives, knife-knives lives-lives

by changing 'y' into Ies 'Y' తో అంతమయ్యే పదాలలో 'y' బదులు 'ies' చేర్చాలి.

Ex: Sky-skies, Fly-flies, Lady-Ladies, cry-cries

by adding 'S' to 'Y'. 'Y' తర్వాత 'S' చేర్చాలి.

Ex: day-days, way-ways,

by adding 'en'. మరికొన్ని ఏకవచన పదాలకు 'en' చేర్చడమో సర్దుబాటు చేయడమో చేస్తే బహువచనంగా మారతాయి.

Ex: Ox-Oxen, child-children, Man-men Woman-women

కొన్ని ఏకవచన (Singular) బహువచన (Plural) పదాలు తెలుగు ఉచ్చారణతో ఈ క్రింద యిచ్చాము.

| Singular | Plural |
|---|---|
| Boy (బాయ్) బాలుడు | Boys (బాయ్స్) బాలురు |
| Girl (గార్ల్) బాలిక | Girls (గర్ల్స్) బాలికలు |
| Ass (యాస్) గాడిద | Asses (యాసెస్) గాడిదలు |
| Fish (ఫిష్) చేప | Fishes (ఫిషెస్) చేపలు |
| Fox (ఫాక్స్) నక్క | Foxs (ఫాక్సెస్) నక్కలు |
| Bench (బెంచ్) బల్ల | Benches (బెంచెస్) బల్లలు |
| Mango (మాంగో) మామిడి | Mangoes(మాంగోస్) మామిడిపండ్లు |
| Bafelo (బఫెలో) దున్నపోతు | Bafeloes (బఫెలోస్) దున్నపోతు |
| Cow (కౌ) ఆవు | Cows (కౌస్) ఆవులు |
| Gas (గ్యాస్) గ్యాసు (వాయువు) | Gasses (గ్యాసెస్) వాయువులు |
| Bush (బుష్) పొద | Bushes (బుషెస్) పొదలు |

| | |
|---|---|
| Tax (టాక్స్) పన్ను | Taxes (టాక్సెస్) పన్నులు |
| Watch (వాచ్) గడియారం | Watches (వాచెస్) గడియారము |
| Hero (హీరో) నాయకుడు | Heroes (హీరోస్) నాయకులు |
| Potato (పొటాటో) ఆలుగడ్డ | Potatoes (పొటాటోస్) ఆలుగడ్డలు |
| Calf (కాఫ్) దూడ | Calves (కావ్స్) దూడలు |
| Loaf (లోఫ్) రొట్టెముక్క | Loaves (లోవ్స్) రొట్టెలు |
| Half (హాఫ్) సగము | Halves (హావ్స్) సగములు |
| Thief (థీఫ్) దొంగలు | Thives (థీవ్స్) దొంగలు |
| Shelf (షెల్ఫ్) అలమర | Shelves (షెల్వ్స్) అలమరలు |
| Hoof (హుఫ్) గిట్ట | Hooves (హూవ్స్) గిట్టలు |
| Roof (రూఫ్) కప్పు | Roofs (రూఫ్స్) కప్పులు |
| Gulf(గల్ఫ్) సంధి (జల) | Gulfes (గల్ఫ్స్) జలసంధులు |
| Wolf (ఉల్ఫ్) తోడేలు | Wolfs (ఉల్ఫ్స్) తోడేళ్లు |
| Knife (నైఫ్) కత్తి | Knives (నైవ్స్) కత్తులు |
| Wife (వైఫ్) భార్య | Wives (వైవ్స్) భార్యలు |
| Proof (ప్రూఫ్) నిదర్శనము | Proofs (ప్రూఫ్స్) ఆధారములు |
| Chief (చీఫ్) ప్రముఖుడు | Chiefs (చీఫ్స్) ముఖ్యులు |
| Dwarf (డ్వార్ఫ్) పొట్టివాడు | Dwarfs (డ్వార్ఫ్స్) పొట్టివారు |
| Life (లైఫ్) ప్రాణము | Lives (లైవ్స్) ప్రాణములు |
| Safe (సేఫ్) బీరువా | Safes (సేఫ్స్) బీరువాలు |
| Stuff (స్టైఫ్) పోరాటము | Strives (స్టైవ్స్) పోరాటములు |
| Fly (ఫ్లై) ఈగ | Flies (ఫ్లైస్) ఈగలు |
| City (సిటీ) పట్టణము | Cities (సిటీస్) పట్టణములు |
| Babay (బేబీ) పసిపాప | Babies (బేబీస్) పసిపాపలు |
| Key (కీ) చెవి (తాళం) | Keys (కీస్) చెవులు (తాళాలు |
| Toy (టాయ్) ఆటవస్తువు | Toys (టాయ్స్) ఆటవస్తువులు |
| Army (ఆర్మీ) సైన్యము | Armies (ఆర్మీస్) సైన్యములు |
| Story (స్టోరీ) కథ | Stories (స్టోరీస్) కథలు |
| Monkey (మంకీ) కోతి (మర్కటము) | Monkies (మంకీస్) కోతులు |

Play (ప్లే) ఆట
Woman (ఉమన్) స్త్రీ
Man (మాన్) మగవాడు
Foot (ఫుట్) పాదము
Tooth (టూత్) పన్ను
Goose (గూస్) బాతు
Mouse (మౌస్) చిట్టెలుక
Louse (లౌస్)పేను
Brother (బ్రదర్) సోదరుడు
Cow (కౌ) ఆవు

Plays (ప్లేస్) ఆటలు
Women (ఉమెన్) స్త్రీలు
Men (మెన్) పురుషులు
Feet (ఫీట్) పాదములు
Teeth (టీత్) పళ్లు
Grease (గ్రీస్) బాతులు
Mice (మైస్) చిట్టెలుకలు
Lice (లైస్) పేలు
Brothers (బ్రదర్స్) సోదరులు
Kine (కైన్) ఆవులు

*గమనిక :* Sheep, deer, swine, Trousers మరియు scissors అనేవి ఏకవచనమైనా, బహువచనమైనా అలాగే పలకాలి. వ్రాయాలి. ఎప్పుడూ బహువచనంలోనే వుంటాయి.

Ex : 1. This scissors is very sharp
ఈ కత్తెర చాలా పదునుగా ఉంది.
2. Give me your trousers of blue.
నీ నీలిరంగు చొక్కా నాకివ్వు

## DEGREES OF COMPARISON

ఒక వ్యక్తిగానీ, ఒక వస్తువును గానీ లేదా ఒక జంతువును గానీ మరొక దానితో సరిపోల్చునపుడు వాక్యంలోని విశేషణం (Adjective) పాజిటివ్ (Positive), కంపారిటివ్ (Comparitive), సూపర్‌లేటివ్ (Superlative) డిగ్రీలలో చెప్పబడుతుంది.

**1. *Positive degree* (పాజిటీవ్ డిగ్రీ) :** ఇతరములతో సరిపోల్చనప్పుడు విశేషణంలో (adjective) ఎలాంటి మార్పు ఉండదు.

Ex: Crane's neck is tall.
కొంగ మెడ పొడవుగా వున్నది
ఇక్కడ కొంగ మెడకు దేనితోనూ పోలికలేదు కాబట్టి 'tall' అనే విశేషణం మార్పు చెందకుండా వుంది.

## 2. *Comparitive degree* (కంపారిటివ్ డిగ్రీ)

Ex: Ostritch's neck is tallar than crane.

కొంగమెడకన్నా 'ఉష్ట్రపక్షి' మెడ పొడవైనది.

ఈ ఉదాహరణలో కొంగమెడ, ఉష్ట్రపక్షి మెడతో పోల్చబడినది. అందువల్ల 'Tall' అనే విశేషణం అనే కంపారిటివ్ డిగ్రీ (Comparitive Degree) లో చెప్పబడింది.

ఇలాగే : Big-Bigger, wide-wider, small-smaller, loud-louder.

(Positive కి 'ER' చేరితే Comparitive అవుతుంది.)

## 3. *Superlative degree* (సూపర్‌లేటివ్ డిగ్రీ)

విశేషణము (Adjective) యొక్క సూపర్‌లేటివ్ డిగ్రీరూపాన్ని అన్నిటికన్నా హెచ్చుస్థాయిగానూ, అధమస్థాయిగానూ పోల్చే వాక్యాలలో వాడతారు.

Ex: Tallest neck animal is Zirafe.

జిరాఫీ మెడ మిక్కిలి పొడవైనది.

పై ఉదాహరణలో 'మిక్కిలి పొడవైన' అనే పోలిక కోసంTallest' అనే సూపర్‌లేటివ్ డిగ్రీలో విశేషణం (Adjective) వాడబడింది.

ఇలాగే Big-Biggest, wide-widest, small-smallest, loud-loudest

గమనిక : పాజిటివ్ డిగ్రీకి 'EST' చేర్చితే విశేషణం (Adjective) సూపర్‌లేటివ్ డిగ్రీలోకి మారుతుంది.

ఇప్పుడు కొన్ని Adjectives (విశేషణాల) పాజిటివ్, కంపారిటివ్, సూపర్‌లేటివ్ డిగ్రీల రూపాలను పరిశీలిద్దాం.

| *Positive* | *Comparative* | *Superlative* |
|---|---|---|
| Tall | Taller | Tallest |
| Clever | Cleverer | Cleverest |
| Small | Smaller | Smallest |
| Big | Bigger | Biggest |
| Large | Larger | Largest |
| Rich | Richer | Richest |
| Poor | Poorer | Poorest |

కొన్ని Adjectives విశేషణములు irregualr గా compare చెయ్యబడును

| Positive | Comparative | Superlative |
|---|---|---|
| Good (Adj) | Better | Best |
| Bad, ill | Worse | Worst |
| Little | Less, Lesser | Least |
| Much | More | Most |
| many | More | Most |
| Old | Older, elder | Oldest, eldest |
| young | Younger | Youngest |
| Pretty | Prettier | prettist |
| Beautiful | More beautiful | Most beautiful |
| Powerful | More powerful | Most powerful |
| Useful | More useful | Most useful |

1. Krishna is the tallest boy in the class (Superlative)
   Krishna is taller than many other boys in the class (comparative)
   Very few boys are as tall as krishna (positive)
2. Gopal is the cleverest boy in the class (Superlative)
   Gopal is cleverer than many other boys in the class (comparative)
   Very few boys are as clever as Gopal (Positive)
3. Sulthan of Bruno is the richest man in the world (Superlative)
   Sulthan of Bruno is richer than many other men in the world (Comparative)
4. Chennai is one of the biggest cities in South India (Superlative)
   Chennai is bigger than many other cities in India (Comp)
   Very few cities in South India are as big Chennai (positive)
5. Kolkatta is the largest city in India (Superlative)
   Kolkatta is larger than many other cities in South India (Comparative)
   Very few cities in India are as large as Kolkatta (Positive)
6. India is the largest democratic countries in the world (Super)
   India is larger than many other democratic countries in the world (Comparative)
   Very few democratic countries in the world are as large as India. (Positive)

## PERSONS (పురుషులు)

ఇంగ్లీషులో భాషాపురుషులు మూడు వర్గాలుగా విభజించబడినాయి.

| | | |
|---|---|---|
| 1. First person | : | person speaking |
| 2. Second person | : | person spoken to |
| 3. Third person | : | person spoken of |

(తానుత్తమ, ఎదుట మధ్యమ, ఎక్కడో ప్రథమ)

| | | |
|---|---|---|
| I st person | : | I (singular) we (plural) |
| IInd person | : | You (both singular and plural) |
| III rd | : | He, She, it (Singular) |
| | | They (Plural) |

### *1.FIRST PERSON:* (ప్రథమ పురుష)

తనను గురించి చెప్పునప్పుడు వాక్యాన్ని ప్రథమ పురుష First person లో చెబుతారు.

ఉదా : I am (నేను) We (మేము)

1) I am Ramu 2) We are Friends.

### *2. SECOND PERSON :* (మధ్యమ పురుష)

తన ఎదురుగా వుండే వ్యక్తిని గాని వస్తువులను గాని సంబోధించునప్పుడు వాక్యం మధ్యమ పురుష Second person లో చెబుతారు.

ఉదా : You (నీవు) Your (నీయొక్క/మీయొక్క)

1) You are good నీవు మంచి వాడివి

2) This is your pen ఇది నీ కలము

### *3.THIRD PERSON :* (అధమపురుష)

తాను, ఎదటనున్నదీ కాక యితర వ్యక్తి, వ్యక్తుల గురించీ, వస్తువుల గురించీ చెప్పే మాటలన్నీ అధమ పురుష Third person లోనే చెప్పాలి.

<u>ఏకవచనం</u>

ఉదా : He (అతను) She (ఆమె) It (అది)

They (వారు/అవి) - **బహువచనం**

1) He is vasu అతను వాసు

2) It is a beautiful flower ఇది ఒక అందమైన పువ్వు

3) They are playing foot ball. వారు ఫుట్‌బాల్ ఆడుతున్నారు

1. My bag is <u>Big</u> (Positive)
   నా సంచీ పెద్దది
   My Bag is <u>bigger</u> than Gopi's Bag (Comparitive)
   గోపీ సంచి కన్నా నా సంచీ పెద్దది.
2. Bill Gates is the <u>Richest</u> man in the world (Superlative)
   ప్రపంచంలో అందరికన్నా బిల్‌గేట్స్ ధనవంతుడు
   Bill Gates is Richer man than many others int he world. (Comparative)
   ప్రపంచంలోని చాలామంది కన్నా బిల్‌గేట్స్ ధనవంతుడు
3. Mount Everest is the highest peak (Superlative)
   ఎవరెస్ట్ పర్వతం అన్నిఇకన్నా ఎత్తైన శిఖరము
   Mount Everestis higher than any other peaks (Comparitive)
   ఎవరెస్టు పర్వతం వున్నంత ఎత్తు మరొకటి లేదు

ఇప్పుడు మూడు పురుషుల్లో ఏకవచన (Singular) బహువచన (Plural) రూపాలు Present tense, Past tenseలో ఎలా వుంటాయో చూద్దాం.

| | *Present tense* | *Past tense* |
|---|---|---|
| *First Person :* | I am (sin) | I was (sin) |
| | We are (plu) | We were (plu) |
| *Second Person :* | You are (plu) | Your were (plur) |
| *Thrid Person :* | He/she/it is (sin) | He/she/it was (sin) |
| | They are (plu) | They were (plu) |
| *I st Person :* | I have | I had |
| | We have | We had |
| *IInd Person :* | You have | You had |
| *IIIrd Person :* | He/She/it has | He/She/it had |
| | They have | They had |

| | |
|---|---|
| I shall go | I should go |
| We shall go | We should go |
| You will go | You would go |
| He/she will go | He/she would go |
| They will go | They would go |

| | |
|---|---|
| I can write | I could write |
| We shall go | I should go |
| We can write | We could write |
| You can write | You could write |
| He/She can write | He/She could write |
| They can write | They could write |
| I may see | I might see |
| We may see | We might see |
| You may see | You might see |
| He/She may see | He/She might see |
| They may see | They might see |

## *PRESENT TENSE* : (వర్తమాన కాలం)

| | |
|---|---|
| I am | నేను ఉన్నాను |
| We are | మేము ఉన్నాము, మనము ఉన్నాము |
| You are | నీవు ఉన్నావు, మీరు ఉన్నారు |
| He is/ She is | అతడు ఉన్నాడు, ఆమె ఉన్నది |
| It is | అది ఉన్నది |
| They are | వారు ఉన్నారు |

## *PAST TENSE* : (భూత కాలం)

| | |
|---|---|
| I was | నేను ఉంటిని |
| We were | మేము ఉంటిమి |
| You were | నీవు ఉంటివి, మీరు ఉంటిరి |
| He was/ She was | అతడు ఉండెను, ఆమె ఉండెను |
| It was | అది ఉండెను |

## *PRESENT TENSE* : (వర్తమాన కాలం)

| | |
|---|---|
| I have | నేను కలిగి ఉన్నాను |
| We have | మేము కలిగి ఉన్నాము, మనము కలిగి ఉన్నాము |
| You have | నీవు కలిగి ఉన్నావు, మీరు కలిగి ఉన్నారు |
| He has | అతడు కలిగి ఉన్నాడు |
| She has | ఆమె కలిగి ఉన్నది |
| It has | అది కలిగి ఉన్నది |

## *PAST TENSE* : (భూత కాలం)

| | |
|---|---|
| I had | నేను కలిగి ఉంటిని |
| We had | మేము కలిగి ఉంటిమి, మనము కలిగి ఉంటిమి |
| You had | నీవు కలిగి ఉంటివి, మీరు కలిగి ఉంటిరి |
| He had | అతడు కలిగి ఉండెను |
| She had | ఆమె కలిగి ఉండెను |
| It had | అది కలిగి ఉండెను |
| They had | వారు కలిగి ఉండిరి |

## *VOICE* (వాయిస్)

*Def : Voice is that form of a verb which shows whether what is denoted by the subject does some thing or something has done to it.*

Subject (కర్త) చే సూచించబడునది. ఒక పనిని చేయుచున్నదో, లేక పని యొక్క ఫలమును పొందుచున్నదో తెలియజేయు క్రియ (verb) యొక్క రూపమునకు 'Voice' అని పేరు.

'Voice' రెండు విధములు

1. Active Voice యాక్టివ్ వాయిస్
2. Passive Voice పాసివ్ వాయిస్

Ex: 1. Rama killed Ravana (Active Voice)

రాముడు రావణుని చంపెను.

Ravana killed by Rama (Passive Voice)

రావణుడు రామునిచే చంపబడెను

ఇక్కడ ప్రాముఖ్యము కర్తకు గాక కర్మకు (Ravana) వచ్చును. అందువల్ల దీనిని Passive Voice అంటారు. Active Voice లో కర్త (Subject) ఎప్పుడూ ప్రథమా విభక్తి (Nominative) లోనే ఉండాలి.

Active Voice ను Passive Voice లోకి మార్చుటకు నిబంధనలు

1. Subject (కర్త)ను Object కర్మగా మార్చాలి.
2. Verb యొక్క Tense ను బట్టి Be యొక్క రూపాల్ని ఉపయోగించాలి
3. Verb ను past participle రూపములోనే వాడాలి.
4. సాధారణముగా 'By' (preposition) ను ఉపయోగించాలి.
5. (Subject) కర్తను by కు (object) కర్మగా మార్చవలెను.

1. Vyasa wrote the MahaBharat (A.V)
   వ్యాసుడు మహాభారతం వ్రాశాడు
   The Mahabharat was written by Vyasa. (P.V)
   మహాభారతం వ్యాసునిచే వ్రాయబడెను.
2. The boy eat the fruit (A.V)
   బాలుడు పండు తిన్నాడు
   The fruit was eaten by the boy (P.V)
   ఆ పండు బాలునిచే తినబడినది
3. Kiran flew the kite (A.V)
   కిరణ్ గాలి పటాన్ని ఎగరేశాడు
   The kite was flown by Kiran (P.V)
   గాలిపటం కిరణ్ చేత ఎగరెయ్యబడింది.
4. The hunter shot dead the Deer (A.V)
   వేటగాడు లేడిని కాల్చి చంపాడు
   The Deer was shot dead by the hunter (P.V)
   లేడి వేటగానిచే కాల్చి చంపబడింది.
5. I write a letter to my sister (A.V)
   నేను నా సోదరికి ఉత్తరం వ్రాశాను
   A letter is written by me to my sister (P.V)
   నా సోదరికి నాచే ఉత్తరం వ్రాయబడింది.

## CONJUGATION OF SOME ORDINARY VERBS

ఇక క్రియ (Verb) యొక్క వివిధ రూపాలను గురించి చెప్పకునే క్రమంలో క్రియకు (verb) గల నాలుగు ప్రధాన విధాలనూ పరిశీలించడం అవసరం

వాక్యం నిర్మాణంలో క్రియ (Verb) యొక్క ఈ నాలుగు రూపాలూ అత్యంత ప్రధానమైనవి. వాక్యం ఏ కాలంలో వుంటే ఆ కాలానికి సంబంధించిన క్రియా రూపాన్ని వాక్యంలో ప్రయోగించడం సమంజసంగా ఉంటుంది.

వాక్యం వర్తమాన (Present) కాలంలో వుంటే క్రియ (Verb) కూడా Present Tense లోనే వుండాలి.

వాక్యం భూతకాలం (Past Tense) లో వుంటే క్రియ (Verb) కూడా Past Tense లోనే వుండాలి.

ఇక వాక్యం ఏ కాలంలో అయినా ఖచ్చితంగా జరుగుతుంది, జరిగింది అని తెలిసినపుడు (అంటే Perfect tense లో) క్రియ (verb) ను Past participle రూపంలో వాడాలి.

వాక్యంలో క్రియ ఏ కాలంలో అయినా జరుగుతూ ఉన్నట్లు (Continuous tense) చెప్పాలంటే క్రియ (Verb) కు 'ing' form చేర్చాలి. కొన్ని క్రియలకు సంబంధించిన ఆ నాల్గు రూపాలూ క్రింద యిస్తున్నాం చూడండి.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | Bear భరిస్తూ | Bore | Born | Bearing భరిస్తూ |
| 2. | Beat కొట్టు | Beat | Beat | Beating కొడుతూ |
| 3. | Become అగు | Became | Become | Becoming అవుతూ |
| 4. | Begin ప్రారంభించు | Begon | Begun | Begining ప్రారంభిస్తూ |
| 5. | Draw లాగితీయు | Drew | Drawn | Drawing లాగుతూ, పొందుతూ |
| 6. | Drink త్రాగు | Drank | Drunk | Drinking త్రాగుతూ |
| 7. | Drive నడుపు | Drove | Driven | Driving నడుపుతూ |
| 8. | Eat తిను | Ate | Eaten | Eating తింటూ |
| 9. | Fall పడు | Fell | Fallen | Falling పడుతూ |
| 10. | Fight పోరాడు | Fought | Fought | Fighting పోరాడుతూ |
| 11. | Fly ఎగురు | Flew | Flown | Flying ఎగురుతూ |
| 12. | Find కనుగొను | Found | Found | Finding కనుగొంటూ |
| 13. | Forbid నిషేధించుని | Forbade | Forbidden | Forbidding షేధిస్తూ |
| 14. | Forgo వదులుకొను | Forewent | Foregone | Forgoing వదులుకుంటూ |
| 15. | Forget మరిచిపోవు | Forgot | Forgotten | Forgetting మరచిపోతూ |
| 16. | Bite కొరుకు | Bit | Bitten | Biting కొరుకుతూ |
| 17. | Blow వీచు | Blew | Blown | Blowing వీస్తూ |

| | | | |
|---|---|---|---|
| 18. Break పగులు | Broke | Broken | Breaking విరగగొడుతూ |
| 19. Choose ఎంచుకోను | Chose | Chosen | Choosing ఎంచుకుంటూ |
| 20. Come వచ్చు | Came | Come | Coming వస్తూ |
| 21. Sing పాడు | Sang | Sung | Singing పాడుతూ |
| 22. Do చేయు | Did | Done | Doing చేస్తూ |
| 23. Sink మునుగు | Sank | sunk | Sinking మునుగుతూ |
| 25. Speak మాట్లాడు | Spoke | Spoken | Speaking మాట్లాడుతూ |
| 25. Steal దొంగిలించు | Stole | Stolen | stealing దొంగిలిస్తూ |
| 26. Get పొందు | Got | Got | Getting పొందుతూ |
| 27. Give ఇచ్చు | Gave | Given | Giving ఇస్తూ |
| 28. Go వెళ్ళు | Went | Gone | Going వెడుతూ |
| 29. Grow పెరుగు | Grew | Grown | Growing పెరుగుతూ |
| 30. Know తెలుసుకోను | Knew | Known | Knowing తెలుసుకొంటూ |
| 31. Ride స్వారీచేయు | Rode | Ridden | Riding స్వారీచేస్తూ |
| 32. Ring మ్రోగించు | Rang | Rung | Ringing మ్రోగుతూ |
| 33. Rise ఉదయించు | Rose | Risen | Rising ఉదయిస్తూ |
| 34. Run పరిగెత్తు | Ran | Ran | Running పరిగెత్తుతూ |
| 35. See చూచు | Saw | Seen | Seeing చూస్తూ |
| 36. Shake కదులు | Shook | Shaken | Shaking కదులుతూ |
| 37. Shine ప్రకాశించు | Shone | Shone | Shining ప్రకాశిస్తూ |
| 38. Swim ఈదు | Swam | Swam | Swimming ఈదుతూ |
| 39. Take తీసుకోను | Took | Taken | Taking తీసుకుంటూ |
| 40. Tear చించు | Tore | Torn | Tearing చింపుకుంటూ |
| 41. Throw విసరు | Threw | Thrown | Throwing విసురుతూ |
| 42. Wear ధరించు | Wore | Worn | Wearing ధరిస్తూ |
| 43. Weave నేయు | Wove | Woven | Weaving నేస్తూ |
| 44. Win గెలుపొందు | Won | Won | Winning గెలుస్తూ |
| 45. Write వ్రాయు | Wrote | Written | Writing వ్రాస్తూ |

| | | | |
|---|---|---|---|
| 46. Lay ఉంచు | Laid | Laid | Laying ఉంచుతూ |
| 47. Lead చూపుతూ | Led | Led | Leading దారిచూపుతూ |
| 48. Learn నేర్చుకొంటూ | Learnt | Learnt | Learning నేర్చుకుంటూ |
| 49. Leave వెళ్లిపోవు | Left | Left | Leaving వదిలివెళుతూ |
| 50. Bring తెచ్చు | Brought | Brought | Buying తెస్తూ |
| 51. Build నిర్మించు | Built | Built | Building నిర్మిస్తూ |
| 52. Burn మండు, కాలు | Burnt | Burnt | Burning కాలుతూ |
| 53. Buy కొను | Bought | Bought | Buying కొంటూ |
| 54. Catch పట్టుకొను | Caught | Caught | Catching పట్టుకుంటూ |
| 55. Creep ప్రాకు | Crept | Crept | Creeping ప్రాకుతూ |
| 56. Deal వ్యవహరించు | Dealt | Dealt | Dealing వ్యవహరిస్తూ |
| 57. Dream కలగను | Dreamt | Dreamt | Dreaming కలగంటూ |
| 58. Feed పోషించు | Fed | Fed | Feeding పోషిస్తూ |
| 59. Flee పారిపోవు | Fled | Fled | Fleeing పారిపోతూ |
| 60. Feel భావించు | Felt | Felt | Feeling భావిస్తూ |
| 61. Keep ఉంచు | Kept | Kept | Keeping ఉంచుకుంటూ |
| 62. Smell వాసన | Smelt | Smelt | Smelling ఆఘ్రాణించు |
| 63. Spend ఖర్చు | spent | Spent | Spening ఖర్చుచేస్తూ |
| 64. Live నివసించు | Lived | Lived | Living నివసిస్తూ |
| 65. Lend బదులిచ్చు | Lent | Lent | Lending బదులిస్తూ |
| 66. Loos పోగొట్టుకొను | Lost | Lost | Losing పోగొట్టుకుంటూ |
| 67. Make చేయు | Made | Made | Making తయారుచేస్తూ |
| 68. Meet కలుసుకొను | Met | Met | Meeting కలుసుకొంటూ |
| 69. Read చదువు | Read | Read | Reading చదువుతూ |
| 70. Say చెప్పుట | Said | Said | Saying చెపుతూ |
| 71. Pay చెల్లించు | Paid | Paid | Paying చెల్లిస్తూ |
| 72. Seek కోరు | Sought | Sought | Seeking కోరుతూ |
| 73. Sell అమ్ము | Sold | Sold | Selling అమ్ముతూ |
| 74. Send పంపు | Sent | Sent | Sending పంపుతూ |

| | | | | |
|---|---|---|---|---|
| 75. | Shoot వేటాడు | Shot | Shot | Shooting వేటాడుతూ |
| 76. | Sleep నిద్రించు | Slept | Slept | Sleeping నిద్రిస్తూ |
| 77. | Sweep శుభ్రంచేయు | Swept | Swept | Sweepig చిమ్ముతూ |
| 78. | Teach బోధించు | Taught | Taught | Teaching భోదిస్తూ |
| 79. | Tell చెప్పు | Told | Told | Telling చెప్తూ |
| 80. | Think ఆలోచించు | Thought | Thought | Thinking ఆలోచిస్తూ |
| 81. | Weep ఏడ్చు | Wept | Wept | Weeping ఏడుస్తూ |
| 82. | Pray ప్రార్థించు | Prayed | prayed | Praying ప్రార్థిస్తూ |
| 83. | Show చూపు | Showed | Shown | Showing చూపుతూ |
| 84. | Sow విత్తు,నాటు | Sowed | Sown | Sowing విత్తుతూ |
| 85. | Help సహాయంచేయు | Helped | Helped | Helping సహాయంచేస్తూ |
| 86. | Lought నవ్వు | Loughed | Loughed | Loughing నవ్వుతూ |
| 87. | Learn నేర్చుకొను | Learnt | Learnt | Learning నేర్చుకొంటూ |
| 88. | Leap దూకు | Lept | Lept | Leaping దూకుతూ |
| 89. | Love ప్రేమించు | Loved | Loved | Loving ప్రేమిస్తూ |
| 90. | Move కదులు | Moved | Moved | Moving కదులుతూ |
| 91. | Order ఆజ్ఞాపించు | Ordered | Ordered | Ordering ఆజ్ఞాపిస్తూ |
| 92. | Touch తాకు | Touched | Touched | Touching తాకుతూ |
| 93. | Threaten భయపెట్టు | Threatened | Threatened | Threatening భయపెడుతూ |
| 94. | Walk నడుచు | Walked | Walked | Walking నడుస్తూ |
| 95. | Want కోరు | Wanted | Wanted | Wanting కోరుచూ |
| 96. | Wash కడుగు | Washed | Washed | Washing కడుగుచూ |
| 97. | Waste వృధాచేయు | Wased | Wasted | Wasting వృధాచేస్తూ |
| 98. | Put ఉంచు | Put | Put | Puting ఉంచుతూ |
| 99. | Cut కోయు | Cut | Cut | Cutting కోస్తూ |
| 100. | Shut మూయు | Shut | Shut | Shuting మూస్తూ |

# TENSES

1. Present Tense వర్తమాన కాలం
2. Past Tense భూతకాలం
3. Future Tense భవిష్యత్తు కాలం

## *PRESENT TENSE* **వర్తమాన కాలం**

1. Simple Present Tense సింపుల్ ప్రెసెంట్ టెన్స్
2. Present Continuous Tense ప్రెజెంట్ కంటిన్యువస్ టెన్స్
3. Present Perfect Tense ప్రెజెంట్ పెర్‌ఫెక్ట్ టెన్స్
4. Present Perfect Continuous Tense ప్రెజెంట్ పెర్‌ఫెక్ట్ కంటిన్యువస్ టెన్స్

### *SIMPLE PRESENT TENSE*

ప్రతిరోజు జరిగే పనుల్ని, అలవాట్లను, నిత్య సత్యాలను గురించి తెలియజేస్తుంది.

సాధారణంగా జరిగే పనులను అలవాటుగా చేసే పనులను, ప్రకృతి సత్యాలను, నిత్యం జరిగే పనులను గురించి చెప్పే టెన్స్‌ను సింపుల్ ప్రెజెంట్ టెన్స్ అంటారు.

సలహాలు, సూచనలు, వార్తా ప్రకటనలు వంటి వాక్యాలను కూడా సింపుల్ ప్రెజెంట్ టెన్స్‌లోనే చెబుతారు.

1. The Sun rises in the east.
   సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు
2. I go to school daily
   నేను ప్రతిరోజు స్కూల్‌కి వెడతాను
3. We take bath every day.
   మేము ప్రతిరోజు స్నానం చేస్తాము
4. Sita goes to temple daily
   సీత ప్రతిరోజు గుడికి వెళుతుంది
5. They play cricket daily.
   వారు ప్రతిరోజు క్రికెట్ ఆడతారు
6. Don't Mistake me.
   నన్ను తప్పుగా అర్థం చేసుకోవద్దు

7. It is good to <u>speak</u> truth alays.
   ఎప్పుడూ సత్యం మాట్లాడటం మంచిది
8. Prime Minister <u>visits</u> the President
   ప్రధానమంత్రి రాష్ట్రపతిని కలుసుకున్నారు
9. Farmers <u>go</u> on hunger strike.
   రైతులు నిరాహారదీక్ష చేస్తున్నారు
10. The Earth <u>rotates</u> around the sun.
    భూమి సూర్యుని చుట్టూ తిరుగుతుంది.

*గమనిక : వాక్యంలో కర్త (Subject) ఏకవచనం (Singular) అధమ పురుష (III Person) లో వున్నపుడు క్రియ (Verb) ను 'es' గానీ 's' గానీ చేరుతుంది.*
*ఉదా : VISIT + S = VISITS*

<u>EXERCISE</u>

1. ______________________
2. ______________________
3. ______________________
4. ______________________

## <u>*PRESENT CONTINUOUS TENSE*</u>

ప్రస్తుతం జరుగుతూ వున్న పనిని గురించి తెలియచేసే టెన్స్‌ను ప్రెజెంట్ కంటిన్యువస్ టెన్స్ అంటారు.

1. I am writing a letter
   నేను ఉత్తరం వ్రాస్తున్నాను
2. Look, they are playing foot ball.
   చూడు, వారు ఫుట్‌బాల్ ఆడుతున్నారు
3. He is reading the lesson
   అతను పాఠం చదువుతున్నాడు
4. Listen somebody is knocking at the door.
   విను ఎవరో తలుపు తడుతున్నారు
5. We are going to school
   మేము స్కూలుకు వెడుతున్నాము

6. You are watching T.V
   నువ్వు టి.వి. చూస్తున్నావు

Am- ఉన్నాను　　Is - ఉన్నది, ఉన్నాడు　　Are - ఉన్నవి, ఉన్నారు

I - am　We - are　You - are　He, she, it - is

is + not = isn't　　are = not = aren't

EXERCISE:

1. ______________________
2. ______________________
3. ______________________
4. ______________________

## *PRESENT PERFECT TENSE*

ఇప్పడే పూర్తి అయిన పనులను గురించి చెప్పే టెన్స్‌ను ప్రెజెంట్ పెర్‌ఫెక్ట్ టెన్స్ అంటారు.

1. I have just come here.
   నేను ఇప్పడే ఇక్కడికి వచ్చాను
2. He has finished writing.
   అతను ఇప్పడే రాయటం పూర్తి చేశాడు.
3. They have paid the money.
   వారు డబ్బు చెల్లించారు.
4. She has arrived in time.
   ఆమె సమయానికి చేరుకుంది.

Have - కలిగియుండు　Has - కలిగియుండు

I, We - have　You - have

He, she, it - has　They - have

Have = not = Haven't

టెన్స్‌లో Perfect స్థితిలో Have, Has అనే క్రియలను తప్పక వాడాలి. వాక్యంలో కర్త Singular III Person లో వుంటే 'Has' మిగతా రూపాల్లో వుంటే 'Have' వుపయోగించాలి.

EXERCISE:

1. ______________________________
2. ______________________________
3. ______________________________
4. ______________________________

## *PRESENT PERFECT CONTINUOUS TENSE*

ఒక పని గతంలో మొదలై ఇప్పటికీ జరుగుతూ వున్నప్పుడు ఆ వాక్యం గురించి చెప్పే రూపాన్ని ప్రెజెంట్ పెర్ఫెక్ట్ కంటిన్యువస్ టెన్స్ అంటారు. ఈ టెన్స్‌లో Have been, Has been అనే క్రియా రూపాలు వస్తాయి.

Ex : I, we - have been    You - have been
He, she, it - has been    They - have been

**Have + not + been = Haven't been**
**Has + not + been = Hasn't been**

Present Perfect Continuous Tense లో 'since', 'for' అనే prepositions ఉపయోగిస్తారు. ఇవి times ని తెలియజేస్తాయి.

*Since* : Point of time ఖచ్చితమైన సమయం చెప్పే వాక్యంలో Since ఉపయోగించాలి.

Eg. Since 1995, since june, since Friday, since 5'O clock, since morning, since evening, since night, since yesterday, etc.....

*For* : Period of time కొంత కాలవ్యవధిని సూచించే సందర్భంలో For ఉపయోగించాలి.

Eg: For 2 hours, for 3 days, for 5 years, for 4 weeks, for 10 days, for 15 minutes, for a long time etc.....

Eg:

1. I have been writing a letter since 7 AM
   నేను ఉదయం 7 గం॥ల నుండి ఉత్తరం వ్రాస్తున్నాను
2. You have been watching T.V since 5'O clock
   నీవు 5 గంటల నుండి టి.వి. చూస్తున్నావు
3. They have been doing business since 1990.
   వారు 1990 నుండి వ్యాపారం చేస్తున్నారు

4. He has been working in this company for 10 years.
   అతను ఈ కంపెనీలో 10 సంవత్సరాల నుండి పని చేస్తున్నాడు.
5. We have been residing here for 3 years.
   మేము ఇక్కడ 3 సంవత్సరాల నుండి పని చేస్తున్నాడు
6. It has been raining for 2 hours
   రెండు గంటల నుండి వర్షం పడుతున్నది.

EXERCISE

1. ______________________
2. ______________________
3. ______________________
4. ______________________

## PAST TENSE భూతకాలము

The work already completed in the previous period is calledPast Tense.

జరిగిపోయిన కాలాన్ని 'భూతకాలము' అంటారు. Past Tense. ఇది నాల్గు రూపాలుగా వుంటుంది.

1. SIMPLE PAST TENSE సింపుల్ పాస్ట్‌టెన్స్
2. PAST CONTINUOUS TENSE పాస్ట్ కంటిన్యువస్ టెన్స్
3. PAST PERFECT TENSE పాస్ట్ పెర్‌ఫెక్ట్ టెన్స్
4. PAST PERFECT CONTINUOUS TENSE పాస్ట్ పెర్‌ఫెక్ట్ కంటిన్యువస్ టెన్స్

### *1. SIMPLE PAST TENSE*

Simple Past Tense represents the work done in Past time
గతంలో జరిగిపోయిన పనిని సింపుల్ పాస్ట్ టెన్స్ తెలియజేస్తుంది.

Past Tenseలో క్రియ (Verb) కూడా భూతకాలం (Past Tense) లోకి మారుతుంది.

Ex: 1. I came from Mumbai last week
   క్రిందటి వారం నేను బొంబాయి నుండి తిరిగి వచ్చాను.
   2. He ran after the running bus.
   అతను వెడుతున్న బస్సు వెనుక పరిగెత్తాడు.

3. He <u>saw</u> a movie yesterday.
   అతను నిన్నొక సినిమా చూశాడు.
4. <u>Did</u> you <u>go</u> to Temple?
   నువ్వు గుడికి వెళ్ళావా?
5. They <u>visited</u> our house last year.
   క్రిందటి సంవత్సరం వాళ్ళు మా యింటికి వచ్చారు.

పై వాక్యాల్లో Came (Come) Ran (Run), Saw (See), Visited (Visit) అనేవి క్రియ (బ్రాకెట్‌లో యిచ్చిన Verbs) కి Past Tense రూపాలు. అలాగే Do అనే క్రియకు Did అనేది భూతకాల రూపం (Past Tense form)

**గమనిక:** Negative వాక్యంలో Did+Not = Didn't (Do not) అవుతుంది.

<u>Ex:</u> 1. Didn't you borrowed some money from him?
   నీవు అతని వద్ద నుండి కొంత డబ్బు అప్పు చేయలేదా?
2. I didn't know whether he came or not.
   అతను వచ్చాడో లేదో నాకు తెలియదు.

<u>EXERCISE</u>

1. ______________________________
2. ______________________________
3. ______________________________
4. ______________________________

## *<u>PAST CONTINUOUS TENSE</u>*

If any work was continuing in past tense it is called Past Continuous Tense.

జరిగిపోయిన కాలంలో ఏదైనా పని జరుగుతూ వున్నట్లు వుంటే దీనిని Past Continuous Tense. అంటారు.

<u>Ex:</u> 1. He was reading, when I went to his house yesterday
   నేను నిన్న అతని యింటికి వెళ్ళేసరికి అతను చదువుకుంటూ వుండెను
2. When the Head Master visited the class, pupil were playing
   ప్రధానోపాధ్యాయుడు ఆ తరగతికి వెళ్ళేసరికి విద్యార్థులు ఆడుకుంటూ వుండిరి
3. It was raining when she came out of the college.
   ఆమె కళాశాల నుండి బయటికి వచ్చేసరికి వర్షం పడుతూ వుండెను.

